# పొలాలమావాస్య కథ

అనగా అనగా ఒక ఊర్లో ఓ బ్రహ్మణమ్మ. ఆమెకు ప్రతి సంవత్సరం పిల్లలు పుడ్తున్నారు. పోతున్నారు. పుట్టగానె పోతున్న సంతానానికి దుఃఖించి ఆ బ్రాహ్మణమ్మ ఊరి వెలుపల పోచక్క తల్లి చుట్టు ప్రతి ఏటా పిల్లల్ని బొంద పెడ్తున్నది. ఈ పొలాలమావాస్యకు పుడ్తున్నారు. మళ్లీ పొలాలమావాస్యకు చనిపోతున్నారు. నోముకుందామని ఎవర్ని పేరంటం పిల్చినా రామంటున్నారు. ఈ విధంగా బాధపడ్తున్న యిల్లాలుకు మళ్ళీ ఎప్పటి వలెనే సంతానమైంది, చనిపోయింది. ఆ పిల్లను తీసుకొని పోచమ్మ దగ్గర బొంద పెట్టేందుకు పోయింది. అప్పుడు పోచక్క తల్లి ఏమే ఊళ్ళో వాళ్ళంతా నాకు మొక్కేందుకు వస్తారు. పాయసం, వడాలు నైవేద్యం తెస్తారు. ఎడ్లకు రంగులు వేసి నెమలి పించం పెట్టి గాలి, ధూళి తగలకుండా ప్రదక్షిణం చేయిస్తారు. పాలేర్లు కల్లు తెస్తారు వాళ్ళ పెళ్ళాలు కడవలతో పానకం తెస్తారు. నువ్వెందుకే శవాలు నా చుట్టు బొంద పెడ్తున్నావని ప్రశ్నించింది. అమ్మా! పోచక్క తల్లి వెయ్యి కళ్ళ తల్లి నీకు తెలవందేమున్నది. నేను పూర్వజన్మలో ఏం పాపం చేసానో కాని ఒక్క ఏడాది పిల్ల పాపలతో పేరంటాల్ను పెట్టుకోలేదు. పొలాలమాస్యనోముకోలేదని దుఃఖించింది. అమ్మవారు దయతలిచి ఈ బద్దులో పెరుగు ఆ బొందల మీద చల్లు. పోయిన నీ పిల్లలు లేస్తారు. యింటికి పోయి తలదడిపి స్నానం చేసి మడి బట్టలతో వంట చెయ్యి. నేను పేరంటాలుగా వస్తానని మాట యిచ్చింది. అమ్మా! అమ్మా! అంటూ పిల్లలు లేచి పిలువ సాగారు. ఆ తల్లి సంతోషంతో పిల్లలతో కలిసి యింటికి పోయి, పోచక్క తల్లి చెప్పినట్లు విధి విధానంగా పూజ, వంటలు చేసి ఉంచింది. మనసులో ఆ తల్లిని ధ్యానించగానే పోచక్క తల్లి పేరంటాలుగా వచ్చి కూచున్నది. పచ్చి విస్తరివేసి రెండు వైపుల కూరలు, పచ్చళ్ళు వడ్డించి చేతికి దారం కట్టి, కడుపు మీద పెరుగు చల్లించుకొని "అత్తవాయినం నా వాయినం అని మూడు సార్లు అని" భోజనం పెట్టింది. చుట్టు పక్కల అమ్మలక్కలు ఆశ్చర్యపడి ఈమె యింటికి పేరంటాలుగా వచ్చిందెవరు? ఈ వూరికి క్రొత్తామె వలె ఉన్నది. ఈమెకు పిల్లలే లేరు. ఇంతమందెక్కడ నుండి వచ్చారని ఆశ్చర్యపోయి అనుమానం తీర్చుకునేందుకు లోపలికి వచ్చి అడిగారు. వచ్చినామె పోచక్క తల్లని తెలుసుకొని సాష్టాంగ నమస్కారాలు చేసారు. ఆమెనడిగి వ్రత

విధానం తెలుసుకున్నారు. బ్రాహ్మణమ్మ పోయిన జన్మలో పొలాలమావాస్య పేరంటాలు రాక ముందే పిల్లలేడుస్తే ఎవరు చూడకుండా పాయసం గారెలు పెట్టిందని, పులుపు, తీపి సరిపోయిందో లేదని చవిచూసిందని, మడి, తడి పాటించకుండ అన్నీ అమాంగీలం చేసిందని అందుకే ఆమె పిల్లలు అలా పుట్టి పెరిగి చనిపోయినారని తెలిపింది. తన అపరాధాన్ని తెలుసుకున్న బ్రాహ్మణమ్మ పోచక్క తల్లి కాళ్ళమీద పడి తనను క్షమించమని వేడుకున్నది. అమ్మలక్కలు కలియుగం పుట్టనున్నది పెరుగనున్నది ఈ వ్రత విధానాన్ని మాకెరిగించమని వేడుకోగా అప్పుడు పోచమ్మ యిలా తెలిపింది. శ్రావణ మాసం చివర భాద్రపద మాసం తొలుత వచ్చే అమావాస్యను "పొలాలమావాస్య" అంటారు. గోడను ఆవుపేడ పాలతో అలికి పసుపు కుంకుమతో పొలాలురాసి 9 వరుసల దారంతో దోరం పోసి పోచక్క తల్లి అని మొక్కి వస్త్రంతో పాటు దారాన్ని అతికించాలి. మట్టితో ఎడ్లను, గొల్లబాలుణ్ణి చేసి, అన్ని రకాల పూలు, తురాయి (అగ్నిపూలు) పూలతో అలంకరించాలి. మక్క కందులు పచ్చి కూరగాయలు నైవేద్యం ధూపం వెయ్యాలి. చీమలు దోమలకు 2 విస్తరాకుల్లో నైవేద్యం వడ్డించాలి. పోచక్క తల్లికి పాశం గారెలు చేసి విధి విధాన యుక్తంగా పూజించాలి. పేరంటాలు చేతికి మెడకు 9 వరసల దోరం కట్టి మనం కట్టించుకోవాలి. కడుపు చల్లన అని ఒకరి బొడ్డు మీద ఒకరు పెరుగు చల్లుకోవాలి. భోజనానంతరం తాంబూలం, దక్షిణ శక్తి కొలది సమర్పించుకోవాలి. ఇలా చేస్తే పిల్లలు మృత్యు వాత పడకుండా కలరా, మలేరియా, మశూచి మొదలైన అంటు వ్యాధులు సోకకుండా పోచక్క తల్లి కాపాడుతదని చెప్పింది. కథ తప్పిన వాక్కు తప్పదు. వాక్కు తప్పిన నుదుగు తప్పదు. నుదుగు తప్పిన ఐదోతనం తప్పదు.

* * *